చున్న భాషలో వారు గీతములను పఠించుచుండిరి. ఇట్టివానిలోనిదే సూర్య దేవతాపరమగు గాయత్రీమంత్రము. ఈ గీతములతో వారు ఆ దేవతలకు ప్రార్థనలు సల్పుచుండిరి. అగ్నిని సృజించి దానిని స్తోత్రముచేయుచు, దక్కిన దేవతలను కొన్నింటిని ప్రత్యక్షముగను, దక్కిన వన్నిరూపకముగను ప్రార్థించుచుండిరి, అట్టి ప్రార్థనలు క్రమముగా కట్టుదిట్టములైన మంత్ర తంత్రములతో పూజాపురస్కారములతోను వృద్ధిజెందెను. తామనుభవించు సర్వవస్తువులు ఆ దేవతలకుగూడ నిచ్చు నేర్పాటయ్యెను. దేవతలతోపాటు వారి బంధుమిత్రాదులకు తామనుభవించు వస్తువులు పంచిపెట్టుపద్ధతి యేర్పడెను. ఇట్టి క్రతువులు తగిన మంత్రములతో నిర్దిష్టముగ జేయించుపని ప్రతిబ్రహ్మకును విధికృత్యమయ్యెను. తక్కినవారు అనగా వారిలో నట్టిపని చేయనివారు సాధారణముగా కృషి మున్నగు కార్యములు చేయజొచ్చిరి. క్రమముగా నీ బ్రహ్మలందరికిని సవ్యముగా నేర్పుటకును, వారి పనులు చూచుటకు ఒక గురుస్థాన మావశ్యకమయ్యెను. అదియే ప్రధాన బ్రహ్మ స్థానము. ఈ బ్రహ్మపదవికి పైన నుడివినవారిలో సమర్థుని యెన్నుకొనుచుండిరి. ఆ కాలపు జనులలో నెవరి కెట్టిసహాయము కావలసినను మంత్ర తంత్ర క్రతుకార్యాదు లన్నింటను ఒక బ్రహ్మ యోగి పనులు నిర్వర్తించుచుండెను. అవసరమైనపుడు మూలబ్రహ్మ ప్రత్యక్షమగుచు కోరినవరముల నిచ్చుచుండెను. ఆ వరములు మన పురాణములలో గన్నడు నతిశయోక్తులు గాకపోయినను, అవసరసహాయములని నమ్మదగియున్నది. ఈ సంప్రదాయ ప్రకారమే నా బ్రహ్మల సంతతి యంతయును బ్రాహ్మణులనియు, యజ్ఞాదులలో మంత్రతంత్రాదులు నెరవేర్చు ముఖ్యుని బ్రహ్మయనియు నప్పటివారు పిలుచుచుండిరి. ఈ యాచారమే యజ్ఞాదులం దిప్పటికిని వచ్చుచున్నది.

అప్పుడు చేయుచుండిన యజ్ఞయాగములలో ౩౩ గురు దేవతల నాహ్వానము చేయుచుండిరి. అందు ౨౨ దేవతలు సూర్య, చంద్ర, పంచ భూతాది గణములవారు, 11 దేవత లానాటి దేవతానాయకులే. వీరు ప్రత్యక్షముగనే హవిస్సులను సోమమును గైకొనుచుండిరి. ఈ వివరములు ముందుపుటలో జెప్పబడును. ఈ యజ్ఞ యాగాదులలో గోవులు, అశ్వములు, ధనములు మొదలగు సంపద లిమ్మనియే వారిని ప్రార్థించుచుండిరి. గాని యానాటివారు మోక్షముకొరకై ప్రాకులాడలేదు. మోక్షము లేక అమృతమను పదములు తర్వాత క్రమముగా నేర్పడెను, ఉపనిషత్తుల



కాలమున కమృతత్వవిషయ మమలులకు వచ్చినది. ఋగ్వేదమున పెక్కు చోట్ల త్రిరేకాదశ దేవతాః యని చెప్పబడెను.

ఇట్టి బ్రహ్మలలోనివారే బృహస్పతి, శుక్రుడు, త్వష్ట, విశ్వకర్మ, మయబ్రహ్మ మున్నగువారు. వీరిలో శుక్రుడు కవీశ్వరుడు. విశ్వకర్మ శిల్పాదులు, గృహనిర్మాణములలో నతికెక్కెను. విశ్వకర్మకుమార్తె బర్హిష్మతిని స్వాయంభువమనువు కుమారుడగు ప్రియవ్రతుడు వివాహమాడెను. మూల బ్రహ్మస్థానము హిమాలయము నుండి బ్రహ్మకపాలమునకు మారెను. పిమ్మట గయాప్రయాగ పుష్కరాదిస్థానములందు గూడ బ్రహ్మక్షేమము లభివృద్ధిజెందెను. ఇపుడచట వసించు గయాళీవంశపుచే రైయుందురు. ఈ బ్రహ్మస్థానమును గౌరవించుటకై మనపూర్వులు నక్షత్రములలో నొక దానికి బ్రహ్మయని పేరిడిరి. ఇట్లే తక్కినవారికిని పేర్లుంచబడియెను. అందరి కన్న పెద్దయగు బ్రహ్మ యున్నపుడు ఆయనకు హెచ్చు గౌరవముండెను. శివుడుగూడ అట్టిపెద్దకు నమస్కృతు లాచరించుచున్నట్లు దక్షయజ్ఞ ధ్వంస కథవల్ల దెలియుచున్నది. ఇంద్రుడే బ్రహ్మాండమున కంతటికి, సూర్యాది గ్రహములకు కారణభూతుడని కొన్ని ఋగ్వేదఋక్కులలో నున్నది.

## ఇంద్రరాజ్యము-స్వర్గము

దేవతలు మొదట హిమగిరియందలి త్రివిష్టపమున, ననగా నేటి టిబెట్టు ప్రాంతమున నివసించిరని చెప్పితిమి. స్వర్గ మెచటనో యుండి యందలి యధిపతియగు యింద్రుడు చచ్చినవారికి స్వర్గాదిభోగము లిచ్చునను కథ కొన్ని పురాణములందు తర్వాత కల్పింపబడి వ్రాయబడినటుల కన్పడును. ఇందలి వాస్తవ మారయుదము. స్వర్గరాజ్యము బ్రహ్మవర్తములోనిదే. దీని రాజధాని క్రమముగా అమరావతియైనది. అమరులు అనగా దేవతలు వసించుటచే నమరావతియయ్యె. దీనికి దాపుననే అమృతసరమున్నది. ఇవి నేటి పంజాబుదేశములో నున్నవి. (*) ఈ చుట్టుప్రక్కల నున్న రాజ్య

(*) మనుస్మృతి 2 వ అధ్యాయమున మత్స్య, పాంచాల, మధుర, కన్యాకుబ్జ దేశము లనబడు పంజాబు శూరసేనదేశములు పూర్వము బ్రహ్మర్షి దేశములేక బ్రహ్మవర్తములోనివనిపిలువబడుచున్నట్లుగలదు. సరస్వతి, దృషద్వతీనదుల మధ్యభాగమును, వింధ్య హిమాచలములమధ్య పూర్వ పశ్చిమసముద్రముల మధ్యనున్న దేశ మార్యావర్తమని యున్నది.